

# Voice of Jagadguru

advaitam paramanandam  an e-magazine on advaita



## Jagadguru Vani అనుగ్రహ భాషణం

### సహాయం కోరడం మానుకోండి, కామాన్ని జయించండి



ఒకరికి ఎన్ని మంచి లక్షణాలు ఉన్నప్పటికీ, ఎంతటి గొప్పవాడు అయినప్పటికీ, మరొక వ్యక్తిని సహాయం అభ్యర్థించినప్పుడు అతను లోకువ (చిన్నవాడు) కాగలడు. హీన స్థితికి రావడం అంటే అల్పబుద్ధిగల వ్యక్తుల నుండి ముష్టి (భిక్ష) కోరడం. అప్పు అడిగితే చాలు మనం దిగజారిపోతాము.

మహాకవి కాళిదాసు ఏమని చెప్పారంటే?

యాఞ్చా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా

దీని అర్థమేమిటంటే ఒక గొప్ప వ్యక్తి నిరాకరించినప్పుడు, ఒక అల్పుడు మనకు సహాయం చేయటానికి ముందుకు వచ్చినప్పటికీ స్వీకరించరాదు. అంటే అల్ప బుద్ధి గల వారి నుండి ఏమీ ఆశించక పోవడమే మంచిది. అదేవిధంగా, ఒక యుద్ధంలో శత్రువులను ఓడించినందున ఒకరిని శౌర్య పరాక్రమములు గల యోధుడు అని పిలవలేము. మన్మథ బాణాల నుండి బయటపడిన వ్యక్తి మాత్రమే నిజంగా సాహసోపేతమైన ధైర్యశాలి. ఎందుకంటే, అరిషడ్వర్గములను (మోహం, కామం, ఉద్రేకం, ఉద్వేగం, ఆవేశం, క్రోధం) జయించడం చాలా కష్టం. అలా జయించిన వాడ్ని 'శ్రేష్ఠుడు' అని అందురు.

మహాభారతంలో, భీష్ముడు తన పరాక్రమానికి అందరి మన్ననలను అందుకున్నాడు. అతను శత్రువులను మాత్రమే ఓడించలేదు, ప్రేమ దేవతను కూడా ఓడించినాడు. తన కోరికలను, మనస్సును జయించినాడు. పుట్టినప్పటి నుంచి అతను కఠోర బ్రహ్మచారి, బ్రహ్మచర్య వ్రతం ఆచరించినాడు.

కాబట్టి, నీచమైన వ్యక్తుల నుంచి సహాయం కోరకపోవడం మరియు కామాన్ని జయించడం ఈ రెండు గుణములు మనిషిని ఉన్నత శిఖరాల వైపు తీసుకువెళుతుంది. ప్రతిఒక్కరూ ఈ విధంగా ప్రవర్తించి శ్రేయస్సును పొందగలరు.

కిం లఘుతాయా మూలం ప్రాకృతపురుషేషు యా యాఞ్చా, రామాదపి కః శూరః స్మరశరనిహతో న యశ్చలతి

**జగద్గురు శంకరాచార్య పరమ పూజ్యశ్రీ మహాసన్నిధానం శ్రీ శ్రీ భారతీతీర్థ మహాస్వామి**
**శ్రీ జగద్గురు శంకరాచార్య మహా సంస్థానం, దక్షిణామ్నాయ శ్రీ శృంగేరి శారదాపీఠం, శృంగేరి.**

**Source: VOJ_MARCH_2020**

## నమామి భగవత్పాదం -10వ అధ్యాయము - శ్రీ శంకర మండనమిశ్రుల సంవాదన




శంకరులు మండనమిశ్రుల ఇంటికి వెళ్ళగా, మండమిశ్రుడు తన తపస్సు చేత వ్యాస మరియు జైమిని మహర్షులను రప్పించి, వారి పవిత్ర పాదములను ప్రక్షాళన చేస్తూ కనిపించినాడు. మండమిశ్రుడు వైదిక శాస్త్రముల ప్రకారం తాను నిర్వహించే శ్రాద్ధ కర్మ కోసం వారిని ఆహ్వానించినాడు. సన్యాసులను అయిష్టపడే మండనుడు, శంకరులతో తీవ్రమైన వాగ్వాదానికి దిగినాడు. మునులు మండనుడిని శాంతింపజేసినారు, ఆ తర్వాత మండన మిశ్రుడు, శ్రీ శంకరుల యొక్క సవాలును స్వాగతించినాడు. చర్చలో ఓడిపోయిన వారు గెలిచిన వారికి శిష్యులు కావాలి అనే షరతు విధించినారు శ్రీ శంకరులు.

మరుసటి రోజు చర్చకు తేదీని ఖరారు చేసిన మండమిశ్రుడు, జైమిని మరియు వ్యాసులను న్యాయమూర్తులుగా ఉండమని కోరినారు. అయితే, మండమిశ్రుని భార్య ఉభయ భారతి, సరస్వతి దేవి అవతారంగా పరిగణించబడుతుంది కాబట్టి ఆమె చర్చకు న్యాయ నిర్ణేతగా వ్యవహరిస్తుందని వారు చెప్పారు. మరుసటి రోజు, శ్రీ శంకరాచార్యులవారు తన ప్రతిపాదనను ప్రకటిస్తూ "అంతా ఒక్కటే" అన్న చర్చను ప్రారంభించినారు. సత్-చిత్-ఆనంద స్వరూపమే బ్రహ్మము, అదే పరమ సత్యం. అజ్ఞానం వలన రజితంగా కనిపించే ముత్యపు చిప్ప వలె, ఆయన ఈ ప్రపంచంగా (ప్రకృతిగా) కనిపిస్తాడు. భ్రమ తొలగినప్పుడు, వెండి దాని ఆధారమైన ముత్యపు చిప్పలో కలిసిపోతుంది. అదేవిధంగా, అజ్ఞానం తొలగిపోయినప్పుడు, ఈ ప్రపంచం (ప్రకృతి) మొత్తం దాని ఆధారమైన బ్రహ్మములో కలిసిపోతుంది, అది ఆత్మతో సమానం. ఇది అత్యున్నత జ్ఞానం, మరియు మోక్షం (జనన మరణాల నుండి విముక్తి); ఉపనిషత్తులు ఈ ప్రతిపాదనకు ప్రామాణికం.

మండమిశ్రుడు తన సిద్ధాంతములను ప్రతిపాదనను చేస్తూ, కర్మ కాండ సూత్రాలను నొక్కి చెప్పాడు: 'కర్మల ద్వారా కలిగే ఫలితాలతో వ్యవహరించే వేదంలోని వేదాంతేతర భాగం నిజమైన అధికారం; కర్మలు మాత్రమే మోక్షానికి దారితీసే మార్గాలు మరియు శరీరధారులైన జీవులు జీవితాంతం కర్మలు చేస్తూ ఉండాలి అని వాదించినారు. ఉభయ భారతి ఇద్దరు పోటీదారుల మెడలో పూలమాలలు వేసి, ఎవరి మాల వాడిపోతుందో వారు ఓడిపోయినట్లుగా పరిగణించబడతారని ప్రకటించింది. అలా వాదోప వాదనలు చాలా రోజులు కొనసాగాయి. శంకరుడి యొక్క బలమైన వాదనలు మండనుడి వాదనలను అధిగమించాయని ఉభయ భారతి అంగీకరించింది మరియు మండనుడిని ఓటమికి గురి చేస్తూ తీర్పు ఇచ్చింది. మండనుడి మెడలోని పూల దండ కూడా వాడిపోయింది. మండమిశ్రుడు పందెం ప్రకారం సన్యాసం స్వీకరించాడు. ఉభయ భారతి తన భర్త ఇప్పుడు సన్యాసి అని సూచిస్తూ మండమిశ్రునికి మరియు శ్రీ శంకరులకు భిక్ష ఇచ్చింది. అయితే, జైమిని సూక్తులు మరియు శ్రీ శంకరుడు ప్రతిపాదించిన పరమ సత్యంతో వాటి సంబంధం గురించి మండమిశ్రునికి ఇంకా కొన్ని సందేహాలు ఉన్నాయి. శ్రీ శంకరుడు ఆ సందేహాలను నివృత్తి చేసినప్పుడు, మండనుడు సాష్టాంగ నమస్కారం చేసి, 'మీరు స్వచ్ఛమైన చైతన్య స్వరూపులు, అయినప్పటికీ మా వంటి అజ్ఞానుల కోసం మీరు ఈ మానవ శరీరాన్ని ధరించినారు అని అన్నాడు.

'తత్వమసి' అనే ఒకే ఒక్క శృతి వాక్యముతో మీరు మమ్మలని అందరినీ రక్షించినారు మరియు ఉపనిషత్తులలో సూచించబడిన వేద మూలమును, వినాశము లేని ఆ పరమాత్మను, ఒక క్షణం ఆలస్యం లేకుండా వెంటనే వివరించారు.' ఈ విధంగా స్తుతిస్తూ, మండమిశ్రుడు శ్రీ శంకరుల పాదముల వద్ద తనను తాను శరణుజొచ్చుకున్నాడు.

"Namami Bhagavatpadam' - Source: Sri Madhaviya Shankara Digvijayam by Sri Vidyaranya

## ||आत्मबोध:|| Ātmabodha ||

తెలుగు అనువాదము - శ్రీ భాస్కరానంద నాథ




निषिध्य निखिलोपाधीन्नेति नेतीति वाक्यतः ।
विद्यादैक्यं महावाक्यैर्जीवात्मपरमात्मनोः ॥ ३०॥

నిషిధ్య నిఖిలోపాధీన్నేతి నేతీతి వాక్యతః .
విద్యాదైక్యం మహావాక్యైర్జీవాత్మపరమాత్మనోః 30..

"ఇది కాదు, ఇది కాదు" అనే వేద వాక్య సహాయంతో అన్ని ఉపాధులను తొలగించి, మహావాక్యముల ద్వారా సూచించబడిన జీవాత్మ మరియు పరమాత్మల యొక్క ఏకత్వాన్ని తెలుసుకోవాలి.

आविद्यकं शरीरादि दृश्यं बुद्बुदवत्क्षरम् । एतद्विलक्षणं विद्यादहं ब्रह्मेति निर्मलम् ॥ ३१॥

ఆవిద్యకం శరీరాది దృశ్యం బుద్బుదవత్క్షరం . ఏతద్విలక్షణం విద్యాదహం బ్రహ్మేతి నిర్మలం .. 31..

స్థూల శరీరం మొదలుకొని కారణ శరీరం వరకు - అజ్ఞానము - ఇవన్నీ నీటి బుడగలవలె నశించేవే. విచక్షణ ద్వారా, వీటన్నింటి నుండి ఎల్లప్పుడూ పూర్తిగా వేరుగా ఉన్న నేను 'స్వచ్ఛమైన బ్రహ్మము' అని తెలుసుకోండి. ....31

देहान्यत्वान्न मे जन्मजराकार्श्यलयादयः । शब्दादिविषयैः सङ्गो निरिन्द्रियतया न च ॥ ३२॥

దేహాన్యత్వాన్న మే జన్మజరాకార్శ్యలయాదయః .శబ్దాదివిషయైః సంగో నిరింద్రియతయా న చ .. 32..

నేను శరీరము కన్నా వేరుగా ఉన్నాను, కాబట్టి పుట్టుక, ముడతలు, వృద్ధాప్యం, మరణం మొదలైన మార్పుల నుండి నేను విముక్తి పొందినవాడిని. నాకు శబ్దము, రుచి వంటి విషయములతో సంబంధం లేదు, ఎందుకంటే నేను జ్ఞానేంద్రియములు లేనివాడిని.

(Will continue….)

Our mail ID : info@voiceofjagadguru.com

## Aparokṣānubhūtī అపరోక్షానుభూతి ............



अहंशब्देन विख्यात एक एव स्थितः परः ।

स्थूलस्त्वनेकतां प्राप्तः कथं स्याद्देहकः पुमान् ॥

అహంశబ్దేన విఖ్యాత ఏక ఏవ స్థితః పరః .

స్థూలస్త్వనేకతాం ప్రాప్తః కథం స్యాద్దేహకః పుమాన్ ....31

'నేను' అనే శబ్దం చేత ప్రకటితమౌతున్న పర బ్రహ్మము (ఆత్మ) ఒక్కడే, ఏకైక స్వరూపుడై వున్నాడు. కానీ ఈ స్థూలమైన శరీరములు అనేకములు. కావున ఈ దేహము ఆత్మ ఎలా అవుతుంది?......31

अहं द्रष्टृतया सिद्धो देहो दृश्यतया स्थितः | ममायमिति निर्देशात्कथं स्याद्देहकः पुमान् || 32||

అహం ద్రష్టృతయా సిద్ధో దేహో దృశ్యతయా స్థితః . మమాయమితి నిర్దేశాత్కథం స్యాద్దేహకః పుమాన్ ..32

'నేను' అనేది 'ద్రష్ట', తెలుసుకునే వాడు. ఈ దేహము అనేది 'దృశ్యం' అంటే తెలుసుకోబడేది. ఇది 'నా శరీరము' అని అంటున్నప్పుడు, ఈ దేహము 'ఆత్మ' స్వరూపుడైన పురుషుడు ఎలా అవుతాడు?..32

अहं विकारहीनस्तु देहो नित्यं विकारवान् । इति प्रतीयते साक्षात्कथं स्याद्देहकः पुमान् || 33||

అహం వికారహీనస్తు దేహో నిత్యం వికారవాన్ . ఇతి ప్రతీయతే సాక్షాత్కథం స్యాద్దేహకః పుమాన్ .. 33..

'నేను' అనేది వికారములు లేకుండా అందరిలో ప్రకాశించే 'ఆత్మ' (పురుషుడు). దేహము ఎప్పుడూ వికారములతో, మార్పులు చెందుతూ వుంటుంది. అలాంటప్పుడు ఈ దేహము ఆత్మ (పురుషుడు) ఎలా అవుతుంది?

(Will Continue..)

## శ్రీ గురు స్తోత్రం (గురు వందనం)



अखण्डमण्डलाकारं व्याप्तं येन चराचरम् ।
तत्पदं दर्शितं येन तस्मै श्रीगुरवे नमः ॥ 1 ॥

అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం .

తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః .. 1 ..

ఎవని స్వరూపము ఈ విశ్వమంతయూ, మరియు చరాచరములన్నింటా నిండి ఉన్నాయో, ఎవని అనుగ్రహం చేత ఆ పరమాత్ముని దివ్య ధామం తెలియబడినదో అట్టి గురువుకు వందనములు.

अज्ञानतिमिरान्धस्य ज्ञानाञ्जनशलाकया ।
चक्षुरुन्मीलितं येन तस्मै श्रीगुरवे नमः ॥ 2 ॥

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా .

చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః .. 2 ..

అజ్ఞానమనే చీకటితో గ్రుడ్డి తనంతో ఉన్నవారికి, జ్ఞానమనే కాటుకతో కంటిని తెరిపించిన గురువుకు వందనములు.

गुरुर्ब्रहमा गुरुर्विष्णुः गुरुर्देवो महेश्वरः ।
गुरुरेव परम्ब्रहम तस्मै श्रीगुरवे नमः ॥ 3 ॥

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః .

గురురేవ పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః .. 3 ..

సృష్టికర్త, పోషకుడు, వినాశకుడు, పర బ్రహ్మము, మరియు సర్వము తానైన ఆ గురువునకు వందనములు.

Our mail ID : info@voiceofjagadguru.com

## శృంగేరి లేఖలు (Letters of Sringeri) - నిజమైన భక్తి, శరణాగతి.



ఈ క్రింది అంకమును అడ్వకేట్ ఎన్ వెంకటరమణ గారు పంచుకున్నారు. వారి ఆంగ్లమునకు నా తెలుగు అనువాదము.

సంతానం లేని ఓ దంపతులు ఇటీవల తమ షష్టిపూర్తిని జరుపుకున్నారు. అరుదైన ఈ సంఘటనను మరియు ఆచార్యుల వారి దివ్యానుగ్రహమును మనతో వారు పంచుకున్నారు. వారిద్దరూ తమకు ఆచార్యుల వారి ద్వారా మంత్రోపదేశం జరగాలన్న తమ కోరికను శ్రీ గురుచరణుల వారి పాదముల వద్ద వుంచినారు. మంత్రోపదేశానికి తెల్లవారుజామునే రావాలని వారికి ఆదేశాలు ఇవ్వబడ్డాయి మరియు శిష్యులు ఇద్దరూ గురువుల ఆజ్ఞను ఎటువంటి ఉల్లంఘనము లేకుండా శిరసావహించినారు.

నరసింహ వనంలోకి అడుగు పెట్టడానికి వారు వంతెన దాటుతుండగా, ఒక మధ్య వయస్కుడైన భక్తుడు వారిద్దరినీ చూశాడు. ఆ వ్యక్తి తన మనసులోని మాటను, తన అనుభూతిని ఆ సమయంలో వ్యక్తం చేయలేదు, కాని శారదాంబ సన్నిధి దగ్గర వేచి ఉండి, వారు సమీపమునకు వచ్చిన తరువాత వారిద్దరి ముందు సాష్టాంగ నమస్కారం చేసి, లేచి నిలబడి, "మీరు పార్వతీ పరమేశ్వరులుగా కనిపిస్తున్నారు నాకు"...అని చెప్పి, మిమ్మల్ని నా స్వంత తల్లిదండ్రులుగా భావన చేసి నమస్కరిస్తున్నాను అని అన్నాడు. దీక్ష తీసుకునే ముందు తల్లిదండ్రుల అనుమతి తప్పనిసరి. ఇకపై వారు తనకి గురువులు అనుగ్రహించిన తల్లిదండ్రులు అని, వారిని తన హృదయంలో ఉంచుకుంటానని చెప్పాడు". మూగవోయిన ఆ జంట ఒక్క అడుగు వెనక్కు వేసినది.

దశాబ్దాలుగా సంతానం లేకుండా ఉండడం వల్ల కలిగిన మానసిక ప్రభావం, సెకనులలో ఈ "దైవ సంఘటన" తో చెరిపివేయబడినది. ఊహించని అందమైన ఈ అనుబంధాన్ని గురువులు బహుమతిగా ఇచ్చారు. యాదృచ్ఛికంగా ఆ మధ్య వయస్కుడైన వ్యక్తికి కూడా అదే రోజున మహాసన్నిధానం నుండి మంత్ర దీక్ష ప్రారంభించబడినది. మహిళకు మంత్ర దీక్ష ఇచ్చిన తరువాత, ఆ జంట వారి కుటుంబ వివరాలు మరియు వారి పుట్టు పూర్వోత్తరములకు సంబంధించిన సమాచారాన్ని మహాసన్నిధానం తో పంచుకున్నారు.

ఆచార్యుల వారు ఇలా అన్నారు, "మీ తాత పేరును మీరు మరియు మీ నాయనమ్మ పేరును మీ భార్య, మీ ఇద్దరూ వారి పేరు ప్రతిష్టలను ఈ రోజు మీతో తీసుకువెళుతున్నారు. వారి తాత వారి జీవిత కాలంలో శ్రీ శారదాంబకు విలువైన మంగళ సూత్రములు ఇవ్వడం ద్వారా అమ్మవారికి కైంకర్యం చేశారని ఆచార్యుల వారు గుర్తు చేసుకున్నారు.

జగద్గురు శ్రీ శ్రీ చంద్రశేఖర భారతీ మహా స్వామివారి కాలంలో శ్రీ కోదండరామ స్వామి వారి సన్నిధి ప్రతిష్ఠించినప్పుడు వారి ముత్తాతలు బ్రహ్మోత్సవములలో పాల్గొన్నారు మరియు ఇప్పుడు ఇటీవల ఆచార్యుల వారు మరలా వారి మనవడిని శ్రీ రాముల వారి సన్నిధికి కైంకర్యం చేయటానికి అనుగ్రహించినారు.

తరువాత ఇద్దరూ శృంగేరి దర్శనం కోసం వచ్చినప్పుడు, మహాసన్నిధానం వారు ఈ క్రింది విధంగా చెప్పారు: "మీ ఇద్దరికీ ఇంకా ఏమి కావాలి. మిమ్మల్ని జాగ్రత్తగా చూసుకోవటానికి మీకు ఇప్పుడు ఒక బిడ్డ కూడా దొరికాడు. అతని ద్వారా ఒక సోదరుడు. ఇప్పటినుంచి మీరిద్దరూ మీ జీవిత కాలానికి ఈ ప్రత్యేక భగవత్ బంధువులతో ఆశీర్వదించబడ్డారు".

"60 ఏళ్ళు పూర్తి అవుతున్న తరుణంలో మేము ఆశీర్వాదం కోసమని ఆచార్యుల వారిని అడిగినప్పుడు, "షష్టిపూర్తి జరగాలి, అది శృంగేరిలో జరగాలి" ...అని ఆచార్యుల వారు మాకు దైవికమైన ఆశీస్సులు అందించినారు. అది కేవలం ఒక సంఘటనగా జరగలేదు. మమ్మల్ని దివ్యమైన బ్రహ్మానందంలో ముంచెత్తిన ఆ వేడుక 5 రోజులపాటు కొనసాగినది. మేము ఇద్దరమూ మరలా నూతన వధూవరుల వలె ముస్తాబు అయ్యినాము.

ఒక్కసారి మా కళ్ళల్లో నీళ్ళు తిరిగినాయి, వెనక్కు తిరిగి చూసుకున్నాము ఆశ్చర్యంతో. ఏమి చేసినాము మనం మఠానికి మరియు ఆచార్యుల వారికి ఇంత ఘనంగా, ప్రత్యేకంగా స్వామి వారి దివ్య కృపను పొందడానికి?

భర్త భార్యతో ఇలా అన్నాడు .....వారి ముందు మనము ఎవరం? జగద్గురువుల ముందు మనము గడ్డి పోచకు కూడా సమానము కాదే? అటువంటి జగద్గురువుల అవ్యాజమైన ప్రేమకు నోచుకోవడం అంటే మాటలా? వారి కథలు, చరిత్ర వ్రాయడం అంటే మాటలా? ...గురుదేవా! మా ఏకైక ప్రార్థన ఒక్కటే.... చాలు చాలు ఇది చాలు ఈ జన్మకు. మా జన్మ ధన్యమైనది... మా జీవితాంతం నిరంతరాయంగా గురు స్మరణతో, గురు సేవలో బ్రతకాలని, తరించాలని మమ్మల్ని ఆశీర్వదించండి గురుదేవా....అని ఆ దంపతులు త్రికరణ శుద్ధిగా గురువులను మనసులో వేడుకున్నారు. "పట్టి విడువరాదు, నా చేయి పట్టి విడువరాదు" అన్న త్యాగరాజ కృతి పాడుకుంటూ.....

శ్రీ గురో పాహిమాం...పరమ దయాళో పాహిమాం...శృంగేరి జగద్గురో పాహిమాం...శ్రీ భారతీతీర్థ పాహిమాం.. శ్రీ విధుశేఖర భారతీ పాహిమాం....దాసోహం శృంగగిరి నాథ ...### సర్వం శ్రీ గురు చరణారవిందార్పణమస్తు ###

(తెలుగు అనువాదము : శ్రీ భాస్కరానంద నాథ)

